శ్రీ

సి రా

ణా ( అమరావతి ) మ

ర చెప్పిన కృ

వా కధలు - సంగతులు ష్ణ





(1) పెళ్లాడిన దయ్యం .. 20-1022

ఈ ఈ కథ కాస్త పూర్వకాలం నాటిది . ఎంతటి పూర్వము అంటే? బ్రిటిష్ వారు ఇండియాలో రాజ్యం మొదలుపెట్టారు . కానీ ప్రజలు ఇంకా కూడా బంగారు కాసులతో వ్యాపారం చేసుకుంటున్నారు .పొలం పనులు చూసే జీతగాళ్ళు బంగారు కాసులకే జీతంగా వుంటున్నారు.

కథ అంటే చెవి కోయించుకొనే నేను ఒక కథకోసం కేరళ వెళ్ళాను . వాళ్ళు నా చెవ్వి కోసి తీసి బుట్టలో వేసుకొని - నాకో కథ చెప్పారు .

కొచ్చప్పన్ - అనే వాడు ఓ నంబూద్రీ వద్ద పెద్ద పాలేరు . కొచ్చప్పన్ ఆరు ఏళ్ళ అనాధగా వున్నప్పుడు , వాడిని గొడ్లు కాసే పనిలో పెట్టుకుని .. నేటికిఅంటే వాడికి పాతిక యేండ్లు వచ్చేనాటికి , వాడిని పెద్దపాలేరుగా ప్రోమోట్ చేసాడు నంబూద్రీ . మన కొచ్చప్పన్ గాడికి ముట్టే జీతం ఏమీలేదు . మూడు పూటలా తిన్నంత అన్నము . రాత్రి పూట ఓ సీసా నాటు సారా .. ఇంతే .

కొచ్చేప్పన్ కి కూడా ఒక వధువు దొరికింది .ఆమె చాలా నల్లని అనాకారి . చెవిటికి చెవుడు మాటలకు మూగ . ఆమె పేరు భగవతి . పెళ్లి చేసుకున్న మరు నాటినుండి ఆమె మొగుడిని ఇలా పోరేది " నెలకు ఒక బంగారం కాసు యజమానిని అడుగు . ఇప్పుడు సరే మనకు పిల్లలు పుడితే ఎల్లా ? మనం పెద్దవాళ్ళము అయి ఓపిక లేని వాళ్లము అయితే ఎట్లాగా ? నువ్వు బంగారు కాసులు సంపాదిస్తే అందులో కొంత మిగుల్చుకుంటాము . వృద్యాపములో ఆసరాగ్గా ఉంటవి " అని

భగవతికి మాటలు రావు , వినపడదు . అందువల్ల మొగుడి సమాధానం ఏమిటో ఆమెకి తలకెక్కేవి కాదు . ఎట్లగొట్ల సంజ్ఞలు చేసి .. నీళ్ల ముంతలు వుపయోగించి - అంట్ల గిన్నెలు మోగించీ భర్తను నిరంతరమూ పోరుతూనే ఉండేది. ఈపోరు పడలేక కొచ్చేప్పన్ " ఓ దయ్యం నన్ను పెళ్లాడినట్లుంది " అని అనుకునేవాడు . కానీ ఎప్పటిలాగానే నంబూద్రీ దగ్గెర జీతం లేని చాకిరీ చేసి , నాటు సారా పుచ్చుకొని ఇంటికొచ్చి తొంగునే వాడు .

కొచ్చేప్పన్ ఇంట్లోనే పడుకోవటం అనే కారణం వల్ల భగవతి కడుపు తెచ్చుకుంది .

కేరళ ఆయుర్వేదానికి మూలికా వైద్యానికి  నేటికీ కూడాపేరు . అక్కడ స్త్రీలు కూడా మూలికా వైద్యములోనూ గృహ వైద్యంలోను ప్రవేశం కలిగివుండటం సర్వ సహజము .

భగవతి , ముదురు బెండకాయలను ఎండపెట్టి వాటిని నిప్పులపై కాల్చి పొడి నూరి దానితో కషాయము కాచి భర్తకు తాగించేది -. ఈ కాషాయం తాగిన వాళ్ళు ఆ తాగుడు మానతారని ఆమె నమ్మకం . బిడ్డపుట్టే నాటికి మొగుడు తాగుడు మానాలని ఆమె తపన . మందులతో తాగుడు మాన్పించటం అనేది నేటికీ సాధ్య పడలేదు కదా ? అందువల్ల కొచ్చే గాడి వ్యవహారం కానీ  తాగుడు వ్యసనం  కానీ మారింది లేదు .

బిడ్డను కనేరోజున భగవతి ఒక పిల్లవాడిని కని మరణించింది . ఆ పిల్లవాడిని ఎవరో ఎత్తుకుని పాలిచ్చి పెంచారు . " పెళ్లాడిన దయ్యం " వదిలి పోయిందని కొచ్చే గాడు సంతోషించి, ఇప్పుడు పూర్తిగా యజమాని  సేవకు . సారా జీవనానికి అంకితం అయ్యాడు .

ఒకనాడు నంబూద్రీ మరియు కొచ్చేప్పన్ కలిసి - మొత్తము మూడు వందల దాకా మిరియాలు  , యాలుకల బస్తాలు   ఎడ్ల బండికి ఎక్కించుకొని ఎర్నాకుళంలో అమ్మకానికి  పోయారు . బస్తాల బరువుకు, నేలలో ఎగుడు దిగుడులకు బండి కీరాకిరా లాడింది .

నంబూద్రీ తన సరుకు అంతా వేయి బంగారు రూపాయలకి ఇంగిలీషు వారికి అమ్మి  ఇద్దరూ తిరుగు ప్రయాణం అయ్యినాబు  . ఇందాక కీరాకిరా లాడిన ఎడ్ల బండి , వీరు తిరుగు ప్రయాణంలో సగం దూరం పైగా ప్రయాణించాక - కదలక మొండికి పడింది . చూస్తే ఇరుసు సగానికి విరిగి వుంది . కంసాలి వస్తేగానీ పని జరగదు .

వీరిద్దరూ - ఎడ్లను నడిపిస్తూ  ఒక ఊరి వద్దకు వచ్చారు . అక్కడ కంసాలి వున్నాడని వీరికి తెలుసు . వీరు ఊళ్లోకి పోగా వూరు అంతా నిద్రపోయి కనపడింది .

చివరికి కనపడిన వాడిని " కంసాలి ఇల్లెక్కడా ? అని వాకబు చేయగా " అందరూ పొరుగూరి దేముని జాతరకు   పోయినారు . కంసాలి కూడా అక్కడే   ఉండవచ్చు " అని చెప్పాడు .

వీరు ఎడ్లని ఆవూరిలోనే ఒక చెట్టుకు కట్టి ఇంత గడ్డి వేసి .తాము కూడా పొరుగూరు జాతర దెగ్గరికి   వెళ్లారు . జాతర మొదటిలోనే వీళ్ళు చూస్తున్న కంసాలి కనపడ్డాడు ." నా దెగ్గర అన్ని సామానులు సిద్ధంగా  వున్నాయి . బండి మరమత్తు

సంగతి రేపు పగటి వెలుతురులో చూద్దాము .మీరు ఆ మూలనున్న నులక మంచాలమీద పడుకోండి " అని ఆదరించాడు .

కంసాలి వీరికి బాగా తెలిసినవాడు మరియు నిజాయతీ పరుడు . అందువల్ల వీరు తమ వద్ద నున్న వేయి బంగారు నాణేలు కంసాలి వద్ద దాచారు . కంసాలి ఇచ్చిన వేడి వేడి ఆహారము తిని -అలసి వున్నా శరీరాలను మంచాలపై పారవేసారు .

ఒళ్ళు చుర చురలాడుతుండటంతో ముందుగా కొచ్చేప్పన్ మేల్కొన్నాడు. ఒళ్ళు విరుచుకుని అతని చుట్టూ పక్కల చూసి అతడు అదిరి పోయాడు . వాళ్ళు సమాధుల మీద పడుకొని వున్నారు . నంబూద్రీ నిద్ర లేచి మరింత అదిరి పోయాడు . నిన్న రాత్రి తన వెయ్యి బంగారు నాణేలను చేతులారా దయ్యం చేతిలో పెట్టానని గ్రహించాడు . ఇరువురు తలా గోక్కుంటూ ఎడ్లను కట్టి వేసిన వూరికి వెళ్లారు . వూరు జనంతో నిండుగావుంది .

ఊరిలోని జనం వీరితో " మీరు అన్న కంసాలి జబ్బు చేసి మరణించి ఆరు నెలలు దాటుతున్నది .కంసాలి జాతరలో వున్నాడని చెప్పినది ఈ ఊరి మనిషి కాక ఒక దయ్యము అయి ఉండ వచ్చు " అని వారు చెప్పారు .

<><><><><>

కొచ్చేప్పన్ తాగుడు మరియు వంటికి మించిన చాకిరీతో నలబై ఏళ్లకే నడుములు ఒంగి పని చేయలేని వాడిగా మారి పోయాడు .అప్పుడు నంబూద్రీ , కొచ్చుకు ఒక్కపూట తిండి కూడా ఇవ్వకుండా - నిర్లక్ష్యం చేసి చివరికి అతడిని ఒదిలించుకున్నాడు .

కొచ్చు చివరకు తన చిల్లుల గుడిసె పాలైనాడు . చూసే వారు లేరు . ఇంతకు ముందు వీడికి- భగవతికి పుట్టిన బిడ్డను చేరతీసిన వారు వచ్చి - ఆ మొగబిడ్డను కొచ్చు బాగోగులు చూడమని పెట్టారు. ఈ బిడ్డపేరు తుళ్లప్పన్ . వీడు అడవులలో తిరుగుతూ ,తేన . కుంకుడులు , శీకాయలు , బంక వంటి వాటిని సేకరించి సంతల్లో అమ్ముతూ ఉండేవాడు . పట్నం వ్యాపారాలు వచ్చి ఈ సరుకులను అతి తక్కువధరకు కొనే వారు . ఇట్లాగా తుళ్లప్పన్ పొట్ట గడవటమే కష్టం అయ్యేది . కొడుకు కష్టం చూసి " వీటిని మనం ఎర్నాకులం వెళ్లి నేరుగా ఇంగ్లేష్ వారికీ అమ్ముకుంటే - మనకు ఇంకొంచం ఎక్కువ డబ్బు వస్తుందని చెప్పాడు .

కొచ్చుకు ఇంతకు ముంది ఎర్నాకులం వెళ్లిన అనుభవం వుంది కదా ? కాలం గడుస్తూ ఉండగా - ఎర్నాకులంనుండి కొచ్చేప్పన్ వూరికి వచ్చే దారులలో చాలా మార్పు వచ్చింది . కొన్ని దారులు పొలాలు అయ్యాయి . కొన్ని చోట్ల ఊళ్ళు వెలిశాయి . దారి మెలికలు తిరిగింది . కొన్ని చోట్ల పొలంలోనునుండి దారులు

పడ్డాయి . కొచ్చేప్పన్ గతంలో ఎరిగిన దారికి - నేటి దారికి పొంతన లేదు. వాళ్ళు ఎర్నాకులం వెళ్లి సరుకు అమ్మి మొత్తానికి ఒక బంగారు నాణెం సంపాదించుకున్నారు . అది ఒక నెలపాటు ఇద్దరి పొట్టలు గడవడానికి సరి పోతుంది .

వీరు ఎర్నాకులం నుండీ తిరిగి వస్తూ , అడ్డదారి అనుకుంటూ ఒక డొంక దారిలో ప్రవేశించి ఒక వూరు చేరారు . ఊరి మొదలు లో ఒక సంత నడుస్తున్నది . వీరిరువురూ అక్కడ ఆగి ఒక హొటల్ వంటి దాని ముందర వున్నా బెంచీ మీద కూచొని టీ తాగి పకోడీలు నమిలారు .టీ ఇచ్చిన ఆమెను చూసి " ఈమె మా అమ్మ భగవతి లా వున్నది " అని తుళ్లప్పను - తండ్రితో చెప్పాడు ." మీ అమ్మ ఇట్లా ఉండదు . భ్రమ పడకు " అని కొచ్చు అన్నాడు . ఆ స్త్రీ ఇంత అని డబ్బు అడక్కుండానే , అనేక పదార్థాలు తెచ్చి కొచ్చు ముందు పెట్టింది . అవన్నీ కూడా కొచ్చుకి చాల ఇష్టమైనవి . భగవతి బ్రతికి వున్న రోజుల్లో ఇవే వండి పెట్టి భర్తను మెప్పించేది . " వచ్చిన ప్రతి పదార్థాన్ని కొచ్చు తన కొడుకు ముందుకి నెట్టి " ముందు నీవు తిను నాయనా . బలంగా ఎదగవలిసి న వాడవు . ఎండుపుల్ల మాదిరి వున్నావు . తినరా నాయనా .. తినరా నాయనా "అని బ్రతిమిలాడీ మరీ కొడుకుకు తినిపించాడు . ఆ స్త్రీ ఎవరో కానీ లోపలినుండి పదార్థాలు తెస్తూనే వుంది . చూడగా చూడగా " ఆ స్త్రీ తన బిడ్డతల్లి అయినా భగవతిని పోలి ఉన్నదని కో చ్చుకు కూడా అనిపించింది . ఆ స్త్రీ చివరకి రెండు కప్పుల టీ తెచ్చి ఇచ్చి ఆతి విందు కు ముగింపు పలికింది . వీరు తమ దగ్గర వున్నా బంగారు నాణేన్ని - తిన్న సరుకుల ధరతీసుకోమని ఆమెకి ఇచ్చారు . " మీకు తిరుగు డబ్బు వస్తుంది " అని చెప్పి - ఆ స్త్రీ లోనికి వెళ్లి పెద్ద సంచితో వచ్చింది . "దారిలో తినుటకు కూడా కొంత తిండి పెట్టాను . హాయిగా వెళ్లి రండి " అని చెప్పింది . తిన్న భద్దకంతోనో ,తాగిన టీ కారణం వల్లనో కొచ్చుకి తుళ్లప్పన్ కి కూడా బద్ధకం అనిపించి , బల్లమీదనుండి గోడకి వీపు ఆనించి నిద్రలోకి జారారు . ఎదో చల్లగా అనిపించి ఇరువురు నిద్ర లేచారు . తాము ఒక సమాధి కి వీపు ఆంచి నిద్ర పోతున్నట్లు వారు తెలుసుకున్నారు ." తల్లీ భగవతీ మమ్ము రక్షింపు " అని ప్రార్ధన చేస్తూ- తండ్రీ కొడుకు తిరిగి ఇంటికి చేరుకున్నారు .చేతి సంచీ విప్పిచూడగా - అలనాడు నంబూద్రీ పోగొట్టుకున్న వెయ్యి బంగారు నాణేలు అందులో ఉన్నట్లు తెలుసుకున్నారు . ఎట్లాగ అంటే, ఆ నాడు నంబూద్రీ ఆ వేయి నాణేలు మూట కట్టిన ఎర్రని ముఖముల్ గుడ్డ కూడా ఆ నాణేలతో పాటు వుంది . సంచీని చూసే కొచ్చు అవి నంబూద్రీ నాణేలు అని గ్రహించేశాడు .

కొచ్చు ఈ నాణేలు తీసుకొని నంబూద్రీ కిచ్చే అవకాశమే లేదు . నంబూద్రీ మొన్నామధ్యనే మరణించాడు . అతని వారసులు ఆస్తులను అమ్ముకొని త్రివేంద్రం వెళ్లి పోయారు .

సంచీలో ఈ డబ్బుతో పాటు కొంత తేయాకు కూడా వుంది . ఆ తేయాకు పొడిలో ఏవో మూలికలు కూడా కలిపి వున్నవి . ఆ టీ కొన్నాళ్ళు తాగే సరికి కొచ్చేప్పన్ కి వున్నా నీరసం , నిస్సత్తువ పోయినాయి . అతడు తన వద్దనున్న బంగారు నాణేలు

పెట్టి వేరే ఎక్కడో కొబ్బరి తోటలు మిరియాల తోటలు యాలుక ల తోట కొని , కొడుకుచే వ్యాపారం చేయించి , కాలు మీదా కాలు వేసుకుని - కొడుకూ కోడలు నీడలో హాయిగా గడపసాగాడు . అయన కోడలు , పొన్న కుట్టీ చాలా మంచిది . వంటలు వండటంలో దిట్ట . ఎప్పుడూ ఎదో ఒకటి వండుతూనే ఉండేది . మామకు భర్తకూ , ఆరారగా ,Tతీపి తీపిగా తిని పిస్తూ ఉండేది .

"పెళ్లాడిన దయ్యం " .. దయ వల్లనే ఇదంతా జరిగింది అని కొచ్చేప్పన్ అప్పుడప్పుడూ కొడుకూ కోడలితో అంటూ వుండే వాడు .

కొడుకు అందుకు ఒప్పుకోక " కాదు కాదు " నా తల్లి భగవతి దయ " అ

నివాదులాడేవాడు .

---------------------------------------------------------------------------------------------0000000---

(2)పాత బంగారానికి కొత్త ఉల్లి పాయలు 18=10=22

"ఉల్లి పాయల ధరలు పెరిగి, బంగారానికి సమంగా మారినవి అని చెప్పే పాత జోకు గానీ, అలాంటిదే ఒక సెటైర్ గానీ కాదు .ఇది.

. మేము నిజంగానే పాత బంగారానికి కొత్త ఉల్లిపాయలు అమ్మే షాప్ .పెట్టాము .దాన్నీ గురించిన యవ్వారం ఇది .

మేము ఇచ్చే ఉల్లిపాయలు కూడా మామూలివే . మీరురోజూ కిలోకి పాతిక లేదా ముప్పై లు ఇచ్చి కొనుక్కునే రకానికి చెందినవె.

మీరు ఏ బంగారపు షాప్ వారి వీ ప్రకటన అన్నా చూడండి - మీలో ఒక ఎక్సయిట్మెంట్ క్రియేట్ చేసి -దానితో వాళ్ళు వాళ్ళ వ్యాపారం వాళ్ళు చేసుకుంటూ వుంటారు .

ఆన్లైన్లో షాపింగ్ చేసే వారు కూడా ,ఎదో ఒక ఎక్సయిట్మెంట్ కి బలిపశువులై , పనికి వస్తావో పనికి రావో తెలువని విచిత్రమైన అనవసరపు వస్తువులు కొంటారు . పాత బంగారానికి కొత్త ఉల్లి పాయలు " అని ఒక కరపత్రం వేసి, హైదరాబాదు మహిళలందరిలో మేమొక ఒక గొప్ప ఎక్సయిట్మెంట్ కి తెరతీసాము .

ప్యాట్నీ సెంటర్లో వెయ్యి చదరపు అడుగుల పెద్ద షాప్ తీసుకున్నాము . ఇదేమి వ్యాపారము ? మీకు కస్టమర్లు ఎవరు వస్తారు ? ఈగలు తోలుకోవాల్సిందే ? అని చాలా మంది మమ్మల్ని ఎక్కిరించారు . <> ఇట్లాంటి షాప్ నడుచుద్దా ? నడవదా ? నడిస్తే ఎట్లా నడుస్తది ? అని మీకు సందేహం రావటం సహజం .మా దెగ్గర ఏమీ మాల్ మసాలా లేకుండా మేమీ వ్యాపారాన్ని ఒపెన్ చేయలేదు
.
డబ్బున్న వారికి కొన్ని జబ్బులుంటాయి . ఒకటి ఎక్సిబిషనిజం =ప్రదర్శించుకోవాలనే తహ తహ <> ఇంకోటి.. తమల్నితాము బ్రతికే తీరుని చూసి

అందరూ ముక్కున వేలు వేసుకోవాలని ;[] మరొకటి = డబ్బులు వెదజల్లి సమాజంలో హోదా కల పదవులు పొందాలని [] పోతూ పోతూ మనమేమన్న కట్టుకు పోతామా ? అనుకుంటూ వున్నా దాన్లో ఎదో కొంత - మంచి నీళ్లలా ఖర్చు చేసి వినోదం పొందేవారు [] ఎప్పుడూ ఎదో న్యూస్ లో ఉండాలి అనుకునే వారు ..[] డబ్బు వుపయోగించి తమ మాట చెల్లేలా చూసుకునేవారు. ఇలా శతకోటి . దీనిమీద పీహెచ్డీ చేసి అందరిని పరిచయం చేస్తాను .

ఇక ముందు నేను చెప్పినదంతా చదివి, అప్పుడు కూడా మీరు "" నువ్వు బాగుపడవు అని" రూలింగ్ ఇస్తే తే మీకు కేజీ ఉల్లిపాయలుకు కేజీ బంగారం ఇస్తాను . కానివ్వండి. సవాల్ మీ బస్తీ.

మొదటి రోజున ఒక స్త్రీ కస్టమర్ వచ్చింది అపనమ్మకంగా నే వచ్చింది . ఆమె ఎక్సయిట్మెంట్ కి లోను అయ్యింది కాబట్టి మాషాప్ గుమ్మం తొక్కింది . మేము ఎంతో గంభీరంగా .. " .. పాత బంగారము తీసుకొని ఉల్లి పాయలు ఇచ్చేది నిజమేను . మీరు ఉల్లిపాయ కోసం పాత బంగారం వదులుకుంటున్నారంటే , మీరు లక్ష కోట్లకు అధిపతి అయి వుంటారు . డబ్బు అంటే లెక్కలేని , అంబానీని తలతన్నిన సంపన్నులు అయి వుంటారు . లేకపోతే ఈ తెంపరి తనము, ఈ ధైర్యము మరొకరికి రాదు " అని ఆమెను బాగా పొగిడాము . ఇంకా ఇట్లా వివరించాము " మేడమ్ . మీరు మాకు బంగారము ఇచ్చిన వెంటనే మీగురించి టీవీ లో ఫది నిమిషాల న్యూస్ ఇప్పిస్తాము . దీని కోసమని టీవీ లో ఒక గంట టైం కొనుక్కొని వుంచుకున్నాము . మీరు ఈఒక్క రోజులోనే మీరు గొప్ప సెలబ్రిటీ అవుతారు . డబ్బు అంటే లెక్కలేకుండా ఎట్లా ఉల్లి పాయలు ఎట్లా కొందో చూడండి అని జనం మీగురించి ముచ్చటించుకొని .. మీ ఫోటోలు వాట్సప్ లో షేర్ చేసుకుంటారు. డబ్బు అంటే లెక్క బ్రతకటం లో ఒక సంతోషం వుంది . మా టీవీద్వారా మీ సంతోషాన్ని నలుగురితో పంచుకుందురు " అని చెప్పాము . ఆమె సంతోషం తో అంగీకరించి పావుకిలో బంగారం ఇచ్చి పావుకిలో ఉల్లిపాయలు తీసుకుంది. బోనస్ కింద మేమె ఆమె కు నాలుగు పచ్చి మిర్చీలు ఇచ్చాము .
ఆమె, టీవీలో తన గొప్పచెప్పుకుని -తాను ప్రపంచాన్ని జయించినట్లు . తోటి , కోటి మహిళలమీద పై చేయిసాధించి వందమీటర్లు ముందుకు పోయినట్లు , ఫీలింగుల్లో చూపింది. ఈ ప్రోగ్రాం ప్రసారం అవుతూ నే ఉండగా " ఒక మహిళా మండలి సభ్యురాళ్ళూ , వందమంది వరకు కలిసి మాషాప్ కి వచ్చారు . వారికి ఫండ్స్ అవసరం చాలావుంది . అందుకని వారు డబ్బు అంటే లెక్కలేని ఈమె ను తమ సంఘానికి ఆల్ ఇండియా ప్రెసిడెంట్ గా ఎన్నుకుంటా మన్నారు . ఈమె అయితే ఎడా పెడా ఫండుకి డబ్బు ఇస్తుందని వారి ఆలోచన -- ఆశ . ఈమెడబ్బంటే లెక్కలేని రుజువు కనపడుతూ ఉండటమే వారి ఆశకు మూలము . ఈమె నిజంగానే టీవీ ముందు వారికో ఫది లక్షలు ఇచ్చి , మహిళా సంఘానికి జీవిత కాలపు అధ్యక్షు రాలైంది .
ఇదంతా టీవీ ల ద్వారా చూసిన ఆంధ్ర మహిళాలోకం వెర్రి ఎత్తి పోయింది . మా షాప్కి తాకిడి పెరిగింది . మధ్యాహ్నం రొండూ టూ నాలుగు వరకు టీవీ లో టైం కొనుక్కొని .మహిళలతో ఇంటర్వ్యూలు ఇప్పించసాగాం .
ఒకనాడు ఒక మహిళ కిలో పాత బంగారము ఇచ్చి కిలో ఉల్లి తీసుకుంది . ఆమెకు స్పెషల్ ప్రోగ్రాం వేసాము.ఈమె లెక్కలేని తనము చూసి ఒక రాజకీయ పార్టీ అధ్యక్షుడు మాకు ఫోను చేసి , మాద్వారా ఆమెతో మాటాడి " అమ్మ మీకు మా పార్టీ

అధ్యక్ష పదవి ఇస్తాను . మమ్మల్ని ఆర్థికంగా కాస్త కనిపెట్టి ఉంటే చాలు " అని బ్రతిమాలాడు . మేము చూస్తూ ఉండగానే ఆయనొచ్చి కోటి రూపాయలు పట్టుకు పోయాడు . మరు నాడు ఈమెకు ఫ్లెక్సీ లు కట్టి , వాటికి జై కొట్టుతూ కార్ల రాలీ తీసాడు .
ఇంకో రోజు ఒకామె మూడు కిలోల బంగారము ఇచ్చి ఉల్లి పాయలు తీసుకుంది .మంచి నాయకుడు ఉండి కూడా , తగినంత ఆర్థికం లేక వెనక్కు పడుతున్న రాజకీయ పార్టీ నాయకుడు ఒకాయన ఆమెకు ఎమ్మెల్యే టికెట్ ఇస్తాను అన్నాడు . ఆమె ఒప్పుకుంది . తక్షణ కర్తవ్యంగా ఈమెను ఎం ఎల్ సి చేసాడు .
మరో రోజు ఇంకో ఆమె వచ్చి ఐదు కిలోల బంగారము ఇచ్చి ఉల్లి పాయలు తీసుకుంది . రాజకీయ పార్టీ నాయకుడు స్వయంగా వచ్చి ఆమెకు ఎం.పీ టికెట్ ఇస్తాను అన్నాడు . ఆమె ఒప్పుకుంది. అయన ఇచ్చాడు .ఆమె తిన్నంగా డబ్బు ఖర్చుపెట్టి మినిస్టర్ కూడ అనిపించుకుంది .
ఒకనాడు ఒక నలభై ఏళ్ళ యువకుడు వచ్చాడు " పెళ్లి అయి భార్య వస్తాదేమో ? అన్న ఆశతో ఆరు కిలోల బంగారు నగలు చేపిచ్చాను . ఆరు కిలోలకి ఆరుకిలోఉల్లిపాయలంటే మరీ తక్కువ . ఫది కిలోలు ఇస్తారా అని మాతో బేరానికి దిగినాడు . ఇదంతా లైవ్ గా మా టీవీ లోను , వేసాము . బేరసారాలు జరుగుతూ ఉండగా ఒక పిల్ల పరుగెత్తి కొని వచ్చింది . వస్తా వస్తా రొండు పూల దండలు కూడ తెచ్చుకుంది . పిల్ల పిల్లడు మా కెమెరాల సాక్షిగా పెళ్ళాడేసి - బంగారం వాపసు పట్టుకెళ్లి పోయారు . మన ఉల్లిపాయలు మనకే వున్నాయి - మనది మాల్ మసాలా వ్యాపారం . మనకేమి ఢోకా అని మేము నిమ్మకు నీరెత్తి నట్లు గమ్మునున్నాము . . ఏ నాడు ఏమహిళా వచ్చి ఎంత బంగారం ఇచ్చి ఎన్ని ఉల్లి పాయలు అట్టుకుపోతుందో , ఏ పదవి పొందుతుందో చూద్దాము అన్న ఆసక్తితో ఆ డా మోగా అందరూ మా టీవీ ప్రోగ్రాంలకు అంటుకుపోసాగారు . ఏదోరకంగా ఎదో ఒక పదవి కావాలనుకున్న వారు మా షాపులో ఉల్లిపాయలు కొని టీవీ లో కనపడి కోరుకున్న పదవులు పొంద సాగారు .

మా tv ప్రోగ్రామ్లు పేరు "మాల్ మసాలా " పంచమంతా ప్రసారం అవటం ప్రారంభం అయ్యింది - అందులో వేసే వాణిద్య ప్రకటనల ద్వారా మాకు బోలెడు డబ్బు వచ్చి-- చివరికి ఆ ట్ వీ కంపెనీని , "ఆల్ వరల్డ్-- హక్కలతో కొనుక్కున్నాము .
ఒకామె ఫదికిలోల పాత బంగారానికి ఉల్లిపాయలు తీసుకుంది , ఏమవుతుందో చూద్దామని. .ఈ ప్రోగ్రాం టీవీ లో ప్రసారం అయ్యి , ఈమె మూలంగా , విదేశాలలో , భారత దేశానికి " " గోల్డెన్ ఇండియా " అన్న పేరు వచ్చింది . యునెస్కో వారు వచ్చి ఈమెకు ఇండియా కె బ్రాండ్ అంబాసిడర్ అనే పోస్ట్ ఇచ్చారు .
"మహా స్వర్ణశ్రీ " అనే బిరుదు ఇండియా వారు ఇచ్చారు .
విజయనగరం సామ్రాజ్యములో రత్నాలు రాసులు పోసి పిల్ల కాయలకు గోళీల కింద అమ్మేవారని " చెరిత్ర చెపుతోంది . భారత దేశంలో నేటికీ ఆ వైభోగం కొనసాగుతోంది " అని మా ఉల్లిపాయల సేల్స్ ను టీవీ లలో చూసిన, విదేశీయులు అనుకున్నారు
. అమెరికా నుండీ ఆస్ట్రేలియా నుండీ కెనడా నుండీ జపాన్ నుండీ బడా బడా ఇన్వెస్టర్లు వచ్చి మాకు పాత బంగారం అమ్మిన వాళ్ళని కాంటాక్ట్ చేసి " మేము సౌర శక్తితో నడిచే విమానాలు తయారు చేసి అమ్మే ఫ్యాక్టరీ కడుతున్నాము - మీరు

వాటా కలుస్తారా ?? కలుస్తారా ?? అని బ్రతిమాలసాగారు . వీళ్ళ పేరు విదేశాలలో మారు మోగి పోయింది .
ఇట్లా మూడు కిలోల ఉల్లిపాయలు ఆరుకిలోల బంగారం అన్నట్లు మా వ్యాపారం మూడు సంవత్సరాల పాటు జోరున జరిగింది . ఇక ఇన్కమ్ టాక్స్ వాళ్ళ దిష్టి తగలకముందే , తప్పుకొని తుప్పల్లోకి పోవటం మంచిదని అలోచించి 'అందుబాటులో వున్నా ఆరువందల అరవై ఆరు కిలోల బంగారం చేతపట్టుకొని వచ్చి మీ ఇంటిపక్క ఇల్లుకొనుక్కున్నాము .
మీరు నన్ను చూసి " ఎవరీ బెగ్గర్ గాడు . మన గేటెడ్ కమ్యూనిటీలో ఇల్లేట్ల కొన్నాడు ? మన హెూదాకి నప్పటం లేదు " అనుకుంటుండగా విని , నవ్వొచ్చి నా బ్యాక్ గ్రౌండ్ ఏమిటో మీతో కొంచెంగా చేప్పేను .
--------------------------------------------------------------------------------------

( 3)మేము // నిమ్మకాయల నీలిమ// దబ్బకాయల ధనలక్ష్మి
ఎప్పుడో పాతిక ఏళ్ళ క్రింద వ్యాపారం చేతపట్టుకొని హైదరాబాదు చేరిన నేను , నా జన్మభూమి అయినా వూరిలో వుండే మా తాత గారికి ఖాయిదా చేసి హాస్పెటల్ లో ఉంచారని తెలిసి ఆ ఊరెళ్ళాను . అక్కడ ఒకరు నాకు మందులు తెమ్మని పురమాయింపు చేయగా , వూరిలోవున్న అతి పెద్ద మందుల దుకాణం వెళ్ళాను . <> క్యాష్ కౌంటర్ వెనుక కూచున్న సేటు నా వంకా ను, మందుల చీటీ వంకా ను చూసి " మీకు నిమ్మ కాయల నీలిమా , దబ్బకాయల ధనలక్ష్మి ఇద్దరూ కూడా తెలిసుంటే మీకు మందుల మీద ఫిఫ్టీ పెర్సెంట్ డిస్కౌంట్ వస్తుంది " అని నవ్వేసాడు
" ఓరీ నువ్వటారా? సున్నుండల సూర్యకుమార్ ?" అని నేనూ తిరిగి నవ్వాను.
మేము చాలాసేపు మనసారా నవ్వు కున్నాము . మందులు షాప్ గుమస్తా కిచ్చి హాస్పిటల్కి పంపాము .
<.> ఓం శ్రీ గురుబోన్నమహా <> అని చెప్పుకొని ఇద్దరమూ బాల్యము గుర్తుకు తెచ్చుకున్నాము .
గుబ్బా గుర్నాధం గారని మా లెక్కల మాస్టారు . ఆయన్ని తప్పించుకోవటం చానా కష్టం .అయన ఒకనాటి ప్రేవేటులో మమ్మల్ని ఇద్దరినీ మాత్రమే నిలేసి " ఒరేయి .. ఒక రాగి నయా పైసా బరువు రొండు గ్రాములు అనుకోండి . పాత రాగి ధర వంద గ్రాములకు రొండు రూపాయలు .అనుకోండి. ఇప్పుడు నాదెగ్గర యాభై పైసలు వున్నాయంటే నా దెగ్గర ఎంత ఉన్నట్లు ? అని అడిగాడు . మేము బుర్ర గీక్కొని " రొండు రూపాయలుదా " ఉన్నట్లు అని కూడ పలుక్కొని చెప్పాము .కరెక్టా కాదా అనుకుంటూ నే చెప్పాము . అనుమానం అల్లంలా ఎన్నింటికో మంచింది .
" పిడుగుల్లారా పట్టారురా పాయింటు . వృద్ధిలోకి వస్తారు " అని దీవించి <> "మీకు .. మాయింట్లో చేసినవే అయినా నేతి సున్నుండలు ఇస్తాను . ఇరవై పైసలకు డజను లెక్కన . మీరు రొండు రాగి పైసలకు ఒక సున్ని ఉండా చొప్పున నా క్లాసులో అమ్ముకోండి . నేను ఏమీ అనను . ఫది ఉండలు అమ్మితే మీకుఇరవై పైసాలు వచ్చి, రొండు సున్నుండలు లాభం కింద మిగులుతాయి .<> అవి కమ్మగా తిని, నా ఇరవై పైసాలు నాకిచ్చి మళ్ళా సున్నుండలు కొని అమ్ముకోండి . రాగి పైసాలు కానీ , ఇంగిలీషు వాళ్ళ రాగి దమ్మిడీలు చిల్లు కానీలు ఇలా ఏవైనా సరే రొండు బిళ్లలకి ఒక ఉండ అని అమ్మండి ."అని ఆనతి ఇచ్చాడు <>
<> ఆయనా, మేమూ , కూడా లాభం అన్న మాటవింటేనే చెవులు కోసుకునె వంశంలో పుట్టిన వాళ్ళము . ఆయనకు మాకూ అతికింది ..<>

ఆ రోజుల్లో రాగి పైసాలకు , బ్రిటీషు వారి రాగి చిల్లు కానీలకు దమ్మిడీలకూ , చెల్లు బాటు లేక పెద్దవారు వాటిని ఎక్కడ పడితే అక్కడ పెట్టేస్తూ ఉండేవారు . వాటిని పిల్లలు మాయం చేసినా పట్టించుకొనేవారు కాదు . మా గురువుగారు ఈ టార్గెట్ తో రంగంలోకి దిగి , మమ్మల్ని ఏజెంట్లుగా పెట్టుకొని మాకు ఏజెన్సీ ఇచ్చాడు . వ్యాపారం బ్రహ్మాండంగా నడిచి రోజుకు నాలుగు సున్నుండలు మిగుల్చుకొని వాటిని తినకుండా, వాటిని కూడా అమ్ముకున్నాము . రోజుకు నాలుగు ఉండలకూ ఎనిమిది రాగి పైసల చొప్పున - మా వద్ద పోగు అయినవి . వంద పైసలు కాగానే - తూకం ధరకి అంటే వంద గ్రాముల రాగికి రొండు రూపాయల ధర చొప్పున - మా గురువు గారికి పోటీ వ్యాపారం చేస్తున్న ఇంకో ఆయనకి అమ్మి నాలుగు రూపాయలు అప్పనంగా సంపాదించాము . * ఈ రకంగా మేము "ఓం శ్రీ" అనుకుని గురుగారికి "పంగనామాలు పెట్టాము " <> సున్ని ఉండలు స్టోరేజీ భాద్యత సూర్య కుమారుది . అందువల్ల వాడు సున్నుండల సూర్యకుమారుగా పిల్లలలో నిక్ నేము పొందాడు . నేను కలెక్షన్ లెక్కలు చూసే వాడిని . అందుకని నేను రాగి పైసల రామ కృష్ణాగ నిక్ నేము తెచ్చుకున్నాను .

<o>[]<o>

ఒకనాడు నీలిమ అనే అమ్మాయి వచ్చి- మా చెట్టువి, ఒక నిమ్మకాయ ఇస్తాను - ఒక సున్నుండ ఇస్తావా ? అని అడిగింది ." నిమ్మకాయలు మాకెందుకు ? అని స్తోత్రించాము .

" అబ్బా ఎంత నంగా నాచి తుంగ బుర్రో . వో. నువ్వు రాత్రి చీకటిలో గోలీ షోడాలు అమ్మటం నాకు తెలీదు అనుకోకు . నువ్వు మాయిఇంట్లో వాళ్లకి కూడా షోడాలు అమ్ముతావు . మామూలు షోడాని నిమ్మకాయ షోడా చేసి అమ్ముకో " అనినాకు దిక్కులు చూపింది . <> మా మేనమామది గోలీ షోడాల కొట్టు. " వీడికి వ్యాపారం నేర్పి - పిల్లనిచ్చి పెళ్లి చేసుకుంటాను " అని ఆయన తన అక్క అయినా మా అమ్మకు ఆశ పెట్టి, సాయంత్రం కాలప్పు చీకటిలో నేను షోడాలు అమ్మేటట్లు కుతంత్రం చేసాడు . ఒక నీళ్ల బకెట్ లో ఫది సోడాలు వేసుకొని వీధుల్లో తిరిగే వాడిని . కన్యా లాభం కోసం కష్టపడటం తప్ప కాసుల లాభం లేకపోయింది . నీలిమ కు సున్నుండలు ఇచ్చి ఆమెనుండి నిమ్మకాయలు తీసుకొని, మామూలు షోడాకు నిమ్మకాయ పిండి - నిమ్మకాయ షోడాలు చేసి అమ్మాను. మామూలు షోడా ఐదు పైసలు . కాస్త ఉప్పు ఒక నిమ్మకాయ కలిపిన నిమ్మకాయ షోడా పది పైసలు . ఈ నిమ్మకాయల షోడా సంగతి మా మేనమామకు తెలవదు . పెద్దగా ఖర్చులేని ఉప్పుకర్చు - నిమ్మకాయ ఖర్చు రొండు పైసాలు పోగా - సోడాకి మూడు పైసలు మిగిలాయి . అంటే రోజుకు ముప్పై పైసలు నెలకు తొమ్మిది రూపాయలు .నేను స్వయం సంపాదనా పరుడినై మా మేనమామకి పంగనామాలు చేయించాను , నీలిమ వాళ్ళ నాన్న వ్యాపారంలో దివాళా ప్రకటించి ,సి వ్యాపారం వేరే వూరికి మర్చి, కాపురం ఎత్తి వేసి నందున - నీలిమ మాకు దూరం అయ్యింది . ఆమె చూపించినదారి మాత్రం అట్లాగే ఉండగా ఆ దారిలో నడిచి నేను పెద్దవాడినైనాను .

నిమ్మకాయల నీలిమను ను చూసి , ధన లక్ష్మి అనే పిల్ల వచ్చి " రొండు సున్నుండలు ఇవ్వు . మా చెట్టు దబ్బకాయ ఒకటిస్తాను " అని బేరం పెట్టింది . " ఏమి చేసుకోమన్నావు వాటిని ?" అని అడిగితే ఆ పిల్లే చెప్పింది . " మాయింటికి ఒక ముసలిది వస్తుంది . మాదెగ్గర ఐదు పైసలకు ఒకటి కొని , బ్రాహ్మణా బాజారులో - అణాకి ఒకటి అమ్ముతుంది . మీ సున్నుండల సూర్య కుమార్ గాడికి ఏమైంది ? ఆదివారం పూట్ల బీట్లు కొట్టుకుంటూ సైకిలు మీద ఊరంతా బలాదూర్ తిరిగే

బదులు , ఒక సంచీలోనా దబ్బకాయలు వేసుకొని ఊళ్ళో తిరిగి ఫది పైసాకి ఒకటి అమ్ముకుంటే, కాయకి ఆరు పైసాలు మిగులుద్ది . డబ్బ కాయలతో ఏమి చేయాలో తెలీని మీ సూర్యం గాడికి పెళ్లెట్లా అవుతాదో .. ఏమో చూస్తా గా .." అని దీర్ఘం తీసింది <> . అర్ధం అయ్యింది . ఆమె లే లేత వయసులో సూర్యం మీద మనస్సు పారేసుకుంది. . ప్రేమించి పెళ్లాడే ప్లాన్లు వేస్తోంది . అందుకే ఈ డైరెక్షన్ ఇస్తావుంది.
<>
ఇప్పుడు నిమ్మకాయల నీలిమ వల్ల నేను నెలకు తొమ్మిది - ఫది రూపాయల సంపాదన పరుడినైనాను . సున్నుండల సూర్యం గాడు దబ్బకాయల ధన లక్ష్మీ మూలంగా నెలకు ఫది పన్నెండు రూపాయల సంపాదనా పరుడైనాడు .
మనుషుల మధ్య దూసుకు పొయ్యే బస్సు మనుషులను పక్కకు పరిగెట్టినించినట్లు , కాలం అనే బస్సు మా మధ్యగా దూసుకు వెడుతూ - మమ్మల్ని వ్యాపారం చేత పట్టుకొని ఎక్కడెక్కడికో పరుగు లేట్టేట్లు చేసింది .
<><><>
అటుతిరిగి ఇటు తిరిగీ సూర్యం పుట్టిన వూరికే తిరిగొచ్చి - పెద్ద మెడికల్సు అండ్ సెర్జికల్స్ షాప్ పెట్టి పాపులర్ అయినాడు మందులమీద నూటికి నూరు శాతం లాభం వస్తది . <{}>
నేను పాత బంగారానికి కొత్త బంగారం ఇచ్చే స్కీం పెట్టి - ఒక జేవలరీ షాప్ పెట్టి కోట్లు సంపాదించుతూ వున్నాను.
" అన్నయ్య .. బావున్నావా ?" అంటూ ఇంట్లో నుండి ఒకామె షాప్ లోకి వచ్చి నాకు వేడి వేడి కాఫీ చూపించింది . ఆమె దబ్బకాయల ధన లక్ష్మి . మేము మాటల్లో పడ్డాము .
ఇంతలో మా ఆవిడా ఫోన్ చేసింది " నేను చేతితో ఫోను మూసి " ఓరే ఒక్క సారి నా మిస్సెస్ తో మాటాడి దానికి సర్ప్రైజ్ ఇచ్చు కోరా ."అని నేను ఫోను సూర్యం గాడికి ఇచ్చాను ."నిమ్మకాయల నీలిమా యేనా ? వాట్ ఏ సుర్ప్రైసూ ... మళ్ళా చిన్నవాళ్ళము అందరమూ కలిసాము " అని గంతులు పెట్టిండు .
---------------------------------------------------------------------------------------------------

(4) ఫి ట్నెస్ గురించి వి ట్నెస్

ఒకాయన ఒక రేప్ కేసులో ఇరుక్కున్నాడు . ఇరుక్కున్నాడా ? ఇరికించి బడ్డాడా ? అన్నది ఎటూ తేలేకుండా వున్నది ; రేప్ కేసుకుగాను వున్నా అతి కఠినమైన చట్టం కింద - నలభై ఎనిమిది గంట్లలోపుగా ఉరిశిక్ష ఎదుర్కునే పరిస్థితుల్లో వున్నాడు ఆయన .
జడ్జీ గారు సాక్షులను విచారిస్తూ వున్నాడు .
ఆయన భార్య వచ్చి " ఆయనకు ఫిట్నెస్ లేదు అందుకు నేనే విట్నెస్ " అని స్టేటుమెంట్ ఇచ్చింది .
" ప్రపంచం మొత్తం మీదా , మొగుడి ఫిట్నెస్ గురించి, భార్యను మించిన విట్నెస్ ఉండదు .అదీ భారతదేశం లో అస్సలుండదు . ఇతడు అనవసరంగా కేసులో ఇరికించి పడ్డాడు అని చెప్పి జడ్జి గారు కేసు కొట్టేసాడు .

(5) వెళ్లెదను " -" వెళ్లుము "

"హిమాలయాలకు , చిట్టి చెల్లెలా అనిపించే ఒక పర్వతపు యొక్క శిఖరం మీద అయిదుగురు వ్యక్తులు నిలబడి వున్నారు . అందులోని ఒక యువకుడు తాను నిలబడిన చోటునుండి పది అడుగులు వెనక్కివెళ్లి i , పరుగెత్తుకుంటూ ముందుకు

వచ్చి ఒక్క ఊపుతో కిందకు దూకి వేసాడు. అతని తో వున్నవారు వినోదము చూస్తున్నట్లుగా అంతా చూసి . యువకుడి తాలూకు సంచీని విప్పి అందులో ని వజ్రాలను బంగారు నాణేలను సమ వాటాలు వేసుకొని పంచుకొని అక్కడ మునుండీ విడి విడి గా వెళ్లిపోయారు . యువకుడు క్రిందకు దూకినాక ఏమిజరిగినది అనేది మనకే కానీ వారికి అక్కరలేని విషయము అయ్యింది . ఒక వేళ్ళ వారు తొంగి చూసినా వారికి అర్ధం అయ్యేది కూడా ఏమీ లేదు. ఎందుకంటే ? లోయ ఎంతో లోతుతో చిమ్మ చీకటిగా వున్నది .
<><>
దూకిన యువకుడు మూడు నిమిషాల పాటు గాలిలో కుండా జారి పడుతూ కిందకు వచ్చి వున్నట్లుండి ఒక సాలీడు అల్లిన పెద్ద వలవంటి దానిలో చిక్కుకున్నాడు .అక్కడనుండి సురక్షితంగా జారి నెల మీద నిలబడ్డాడు . అప్పుడు అక్కడికి ఒక దేవత వచ్చింది . యువకుడు దూకిన లోయ పాతాళ లోకమునకు పోవుటకు , వచ్చుటకు మార్గము . ఈ దేవత ఆ పాతాళ లోకమునకు అధిపతి. ద్వారమునకు కావలి యుండునది .
యువకుడు దూకగానే ఈ దేవత ఏనుగు పిల్ల అంతా పరిమాణము కల ఒక సాలీడుని సృష్టించి దానిచేత యువకుడు పడు ప్రాంతములో ఒక వల అల్లవలసినదని ఆదేశించింది . యువకుడు ఈ వలలో చిక్కుకొనియే ఇప్పుడు సురక్షితముగా బయట పడినాడు .
<><>
దేవత ఇట్లా అన్నది ' నీ నేపధ్యము అంతా నాకు తెలుసును . అపకారికి కూడా ఉపకారము చేయవలెనన్న నీ మంచితనము వల్లనే నీవు నాచే రక్షింప బడితివి.ఇదిగో ఈ ద్వారము ద్వారా పొమ్ము . శంకర మంచి అను పట్టణము తగులును . అక్కడి రాజు నీ వంటి వారికి ఆశ్రయము ఇచ్చి సకల సౌకర్యములు సమకూర్చును . పొమ్ము. మంచిగా జీవింపుము " అని పలికినది .
<> దేవత గ్రహించిన యువకుని నేపధ్యము <>
యువకుడు ఒక వేణుగాన విద్వాంసుడు . రాజులను మెప్పించి వారినుండి బహుమానాలు గైకొని జీవితములో స్థిరపడుటకై అతడు దేశాటనము చేయుచుండెను . . ఇతని మంచితనము గ్రహించి ఇతని ఊరి వారే అయిన నలుగురు దుష్టులు, ఇతనికి శిష్యుల వాలే చేరి , అతని సంపాదననుండి తమ పబ్బములు గడుపుకొనుచూ అతనితో పాటు తిరుగుచూ ఉండిరి . ఇందాక కొండ కొమ్మున ఈ యువకుని తో పాటు నిలబడి వున్నా మిగతా నలుగురూ ఈ దుష్టులే . యువకుడుఅనేకమంది రాజులను మెప్పించి బంగారు నాణెములను , వజ్రములనూ, కానుకగా పొంది , ఇంటికి తిరుగు ప్రయాణము అయ్యెను . దుష్టులు మొదట నుండీ ఇతని సంపాదన మీద కన్నులు వేసిరి . వారు .యువకునికి మాయ మాటలు చెప్పి " ఇటునుండి మన వూరికి దెగ్గర దారి కలదు " అని నమ్మించి, అతనిని కొండమీదకు చేర్చి, తమ వద్ద కల కత్తులు తీసి యువకుడిని హత్య చేయ బోయిరి .
అప్పుడు యువకుడు " మీరు నన్ను హత్య చేసిన " బ్రాహ్మణ హత్య చేసిన పాపము మీకు తగులును .నరకమున కూడా కష్ట పడుదురు. అంతే కాక నేను లేకుండా మీరు వచ్చుట చూసి ,మనదేశపు రాజు మీరే నన్ను మాయము చేసినారని గ్రహించి మీ చర్మము ఒలిచి అయినా సరే, నిజాము రాబట్టి మిమ్ము వురి తీయును . నన్ను హత్య చేసి , నా సొమ్ము తస్కరించినా గానీ మీరు సుఖ పడునది ఏమీ ఉండదు . అందువలన , మీ సుఖము కోరి , నాకు నేనుగా మీకు ఈ కొండ

లోయలోనికి దూకి మరణింతును . నా ఆత్మహత్యకు మిమ్ము ఎవరూ నిందింపరు . శిక్షింపరు . మీరు నా సంపద ను చక్కగా భయము లేకుండా అనుభవింపుము '. మీ పిల్లా పాపలతో సుఖముగా బ్రతుకుము అనెను . ఆపై కొండపై నుండీ లోయలోకి ఉరికెను .
దేవత మంచి వారిని రక్షించి కాపాడవలెనన్న - నియమము తో ప్రవర్తించునది. అపకారికి కూడా ఉపకారము చేయనెంచిన యువకుని మంచి తనమును గుర్తెరిగిన దేవత , " మంచి వారిని రక్షింపవలయును అన్న తన నియమమును అనుసరించి యువకుని రక్షించినది - ఇప్పుడు శంకరమంచి నగరమునకు పంపు చున్నది . యువకుడు శంకరమంచి నగర రాజుని దర్శించి అన్ని సౌకర్యములు కల ఇంటిని పొందెను . రాజు , అతనికి చక్కని యువతిని ఇచ్చి పెండ్లి చేసెను . యువకుడు రాజాస్థానము లో వేణు గానము వినిపించి - రాజు యొక్క మెప్పు పొందినాడు .పాతాళము అన్న రత్నాలకు వజ్రాలకు లోటు లేని ప్రదేశము . అందువల్ల ఇతనికి లెక్కకు మిక్కిలిగా వజ్ర వైడూర్యములు కానుకగా లభించినవి .
<>వజ్రకవచము లు <>
పాతాళ లోకమున కూడా మంచి వారికి చెడ్డ వారికీ యుద్ధములు జరుగుట కలదు . ఆ యుద్ధములో శంకర మంచి రాజా సైన్యము అధికముగా గాయముల పాలగుచుండెడిది . యువకుడు గాయముల పాలయిన సైన్యమును చూసి జాలి పొంది , ప్రజలకు ఏదన్న ఉపకారము చేయ నెంచి తన భార్య సహాయముతో వజ్రకవచములు అనునవి తయారు చేసి రాజునకు ఇచ్చెను . వజ్ర కవచము అనగా రెండు పొరలుగా కుట్ట పడిన ఒక తోలు చొక్కా లో , పొరకు పొరకు మధ్య సన్నని వజ్రములు పోసి ధరించుటకు సౌకర్యముగా కుట్టిన చొక్కా . పాతాళ వాసులు అనగా బుద్ధికి అధములు. అందువల్ల వారికి ఇప్పటివరకూ ఇటువంటి ఆలోచన రాలేదు . ఇటువంటిది ఆ రాజ్య ప్రజలు ఎరుగరు . . వజ్రము ఖఠినత్వము ముందు ఏ కత్తి అయినా మొక్క పోక తప్పదు . అందువల్ల రాజసైనికులు గాయముల పాలు కాకుండానే రాజ్యమును సమర్ధవంతముగా రక్షింప గలిగిరి . ప్రజలకు ఇది ఎంతో మేలు జరిగినది . సైనికులు అనగా ఒక తల్లికి బిడ్డలే గా ... ? యువకుడు ప్రతి ఫల ఆపేక్ష ఏమీ లేకయే , ఉపకార బుద్ధితో , తన వద్ద పోగుపడిన వజ్రములను ఉపయోగించియే వజ్ర కవచములు తయారు చేసి ఇచ్చెను .ఇందు కారణముగా యువకుడు ఎంతో మంచి పేరు పొంది రాజ్యములో ప్రముఖుడు అయ్యెను .
వజ్ర కవచములు కారణముగా , రాజు యువకుని పట్ల చాలా ప్రసన్నుడై " నీకు ఏమి కావలెను " అని అడిగెను . అప్పుడు యువకుడు " నేను నా భార్య - మీరు ఇచ్చిన సంపదలతో కలిసి భూలోకము వెళ్లునట్లు అనుగ్రహించండి " అని కోరెను . తన వంటి వానిని వదులుకొనుటకు రాజు ఇచ్చ గించక పోవచ్చునని యువకునికి అనుమానము కలదు . అందువల్ల ఈ సందర్భమును వాడుకొనెను .
అప్పుడు రాజు ఇట్లు అనెను " భూలోకమును చూడవలెనన్న కోరిక విష్ణు మూర్తి కైనను వున్నదే ? . అందువల్లనే కదా? అయన దశావతరములు ఎత్తేను ? సమంజసమైన నీ కోర్కె నేను తీర్చుదును . కానీ నా చేతులలో ఏమియును లేదు . నిన్ను ఈ రాజ్యమున ప్రవేశపెట్టిన దేవత ఏ నిన్ను విడిచి పుచ్చుటకు అంగీకరింప వలయును .ఆమె మాపై అధికారి . ఆమెకు మంచి వారు అనిన హద్దులులేని ప్రేమ . నీ వంటి మంచి వారు ఈ లోకమును విడిచి పుచ్చి మరలా భూలోకము ను చేరి నచొ - వారు - అక్కడి మనుషులచే తిరిగి ఏమి ఇబ్బంది పాలు అగుదురో అన్న భయము చేత ఆ దేవత ఎవరినీ ఈ రాజ్యము నుండీ

విడిచిపుచ్చదు . ఇది మంచి వారి పట్ల ఆమెకు కల ప్రేమకు పర్యవసానము ......
ఇది విన్న నీకు " అయినచో నేను ఇప్పుడు చెడ్డగా ప్రవర్తించినచో ,దేవత నన్ను విడిచి పుచ్చ వవచ్చునేమో ? అన్న ఆలోచన కలగవచ్చును ? కానీ . నీవు మంచి నుండి, చెడ్డగా మారిన మారునిముషము ఆ దేవత నిన్ను నల్లిని నలిపినట్లు నలిపి వేసి చంపును . ఆమే అంత కోపిష్టి కూడా. అందువలన నీవు చెడ్డ వాడివా మంచి వాడివా ? అన్న ధర్మ సందేహము కలుగునట్లు , ఆ సంశయము ఎప్పటికీ తొలగకుండు నట్లు , నీవు ఉపాయముగా ఏదన్నా చేయుము . దీనికై నేను నీకు ఒకే ఒక అవకాశము ఇత్తును . అప్పుడు దేవత నిన్ను విడిచి పుచ్చు అవకాశము ఉండవచ్చును " అని చెప్పెను .
యువకుడు విచారంతో ఇంటికి వచ్చి తన భార్యతో అన్ని సంగతులూ చెప్పెను . ఆమె ఎంతో ఉపాయశీలి . భర్తతో కలిసి భూలోకమును చూసి ఆనందింపవలెనని కోరిక ఆమెకు కూడా కలదు .. అందు వలన ఆమె ఒక ఉపాయమును యోచించెను .
<.>ఉపాయము ఏమిటి ?<>
భార్య చెప్పిన ఉపాయమునను సరించి యువకుడు ఒక గోడను కట్టింప తల పెట్టెను
ఈ గోడ కట్టుటకు గాను అతను ఉదయమునే ఊరిలోకి వెళ్లి" రోజా కూలీ కింద రోజుకొక బంగారు నాణ్యము ఇచ్చు ఒప్పందం మీద కొందరు కూలి వాళ్ళను పిలుచుకు వచ్చెను.
వారు పని మొదలు పెట్టిరి . యువకుడు మధ్యాహ్న సమయమున మరొక సారి ఊరి లోనికి పోయి ఒక్క పూట కూలికి ఒక్క బంగారు నాణెము ఇచ్చు ఒప్పందం మీద కొందరు కూలి వాళ్ళను పిలుచుకు వచ్చెను . .
వారు కూడా మొదటి వారితో కలిసి గోడ కట్టుటలో పాల్గొనిరి . సాయంత్రము కూలీ డబ్బులు ఇవ్వబడినవి . యువకుడు ప్రతి ఒక్కరికీ ఒక్కొక్క బంగారు నాణ్యము ఇచ్చెను .
ఒక్క పూట పనికి నిండు కూలీ దొరికిన వారు - సంతోషముతో- నీవు మంచి వాడవు అని యువకుని పొగిడిరి.
రోజు అల్లా కూలీ చేసిన వారు కూడా కూలీ కింద ఒక బంగారు నాణెము పొందిరి . ఒప్పుకున్నా కూలీ దొరికినందుకు వారు సంతోషింప వాల్సింది ? కానీ వాళ్ళు ఏమీ సంతోషము తెలుపక " అర రోజు పనికి నిండు కూలీ ఇచ్చినప్పుడు - నిండు రోజు పని చేసిన మాకు రెట్టింపు కూలీ రావద్దా ? అని వాదనకి దిగిరి .
యువకుడు వారిని గద్దించి తరిమి వేసెను .వారు " నీవు మంచి మనిషివి కాదు" అయినచో మాకు రెట్టింపు కూలీ ఇచ్చి పంపుదువు " అని యువకుడిని నిందించిరి. వీరు రాజువద్దకు పోయి పరిస్కారం కోరిరి .
యువకుడు ఒకే ప్రయత్నముతో మంచి వాడు , చెడ్డ వాడు కూడా అయినాడు . యువకుడు మంచిగానే వున్నాడా ? లేక చెడ్డగా మారినాడా?అనునది ఎటూ తేలని విషయము అయినది . ఇటు మంచీ అటు చెడూ కానీ వాడిగా యువకుడు గుర్తింప పడ్డాడు .
పై తరువాత యువకుడు తన భార్యను ఒక బుట్టెడు వజ్రాలను తీసుకొని -దేవత కాపుకాస్తున్న పాతాళ లోకపు ద్వారం వద్దకి చేరుకున్నాడు .
దేవత ఈ సరికే యువకుని గురించిన సంగతులు విని వున్నది .' ఆమెకూడ యువకుడు మంచి వాడా ? లేక చెడు వాడా ? అని నిర్ధారించుకో లేక సందేహములో పడిపోయినది . . చెడు వాడే అనుకున్నచో అతనిని చంపి వేసెడిది . మంచి వాడు అనుకున్నచో భూలోకము పోకుండా ఆపి వేసెడిది .

చివరికి , యువకుడు పాతాళ ద్వారము సమీ పించగానే, దేవత అడ్డు తొలిగి దారి ఒదిలినది
" వెళ్లెదను " అని యువకుడు అనుజ్ఞ అడిగెను
" వెళ్లుము " అని దేవత ఆజ్ఞ్య ఇచ్చెను .
యువకుడు తన స్వగ్రామమును తల్లి తండ్రులను బంధు మిత్రులను చేరి సుఖముగా ఉండగా .. ఇంకో టి ఏమో జరిగింది . మంచి వారికి కష్టాలు తప్పవుగదా ?

------------------------------------------------oo00oo----------------------------------------------------------